## సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ





గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి



గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050016441

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014



# శ్రీ రామ శతకము.

శ్రీ భగవద్భక్తి పరాయణుండగు

## పాగరు కృష్ణమూర్తిచే

రచియింపబడి ప్రకటింపబడినది.

---

శ్రీరామ నామాంకిత కందపద్యశతము

---



విజయనగరము

శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాలయందు

ముద్రితము

1932.





# శ్రీ రామ శతకము.

క॥ శ్రీకర రమాకళత్రా
ప్రాకట రవిచంద్రనేత్ర వరశుభగాత్రా
లోకోత్తర చారిత్రా
చేకూర్చుము నాదుకోర్కె శ్రీరఘురామా॥

క॥ అందంబుగ విబుధ జనా
నందంబుగ కర్ణములకు నయమందగ బ
ల్విందుగ జెప్పెద నీపై
కందంబులు నన్నుగావు ఘనగుణరామా॥

క॥ రామా రఘుకులవార్నిధి
సోమా సాకేతధామ శోభితసుగుణ
స్తోమా రిపుభీమా రవి
ధామా సుత్రామవినుత దశరధరామా॥

క॥ అల పాలకడలియందున
విలసిత వటపత్రమందు వేడుకలలరన్

లలనామణియగు లక్ష్మి
కలకంఠియుతుండ వైన ఘనరఘురామా॥

క॥ సనకసనందన మునిజన
వనరుహ గర్భామరేంద్ర వర్యులు నిన్నున్
వినుతు లొనర్ప గజాలరు
ననఘా నిన్నెన్న నాకు నలవియె రామా॥

క॥ ఘనమునిజననుత నిన్నున్
మనమున ననయమును దలతు మరువక నన్నున్
తనయుని క్రియ రక్షింపుము
జనకజ హృత్పద్మమిత్ర సద్గుణరామా॥

క॥ శర్వాణి వినుతనామా
యుర్వీసుత నేత్ర కైరవోన్నత సోమా
గర్వారి మదవిరామా
దర్వీకరశయన నన్ను దయగను రామా॥

క॥ పురుహూతామర వర్యులు
కరుణింపుమటంచు వేడ కరుణానిధి వై
సురవైరుల కదనములో
హరియించియు వారిగాచితౌ రా రామా॥

క॥ నినుస్మరియించిన జనులకు
ఘనతరదుఃఖములు బాపు ఘనుడవటంచున్

మనమునఁ దలంచివేడిన
ననుగావవదేమి వింత నయగుణరామా॥

క॥ హరునకుదోడ్పై త్రిపురా
సురులఁ హరియించువేళ శూలికినీవున్
శరమై వారలద్రుంపవె
కరిపాలాభక్తలోల ఘనగుణరామా॥

క॥ గురుతనయుఁడు సంద్రములో
నురికియు పంచత్వమొంద నొప్పుగ వానిన్
దిరమతినిఁదెచ్చి గురునకు
కరుణాకర యొసఁగితీవు ఘనగుణరామా॥

క॥ ఖరదూషణాది రాక్షస
వరులను దునుమాడి మౌనివర్యులకెల్లన్
చిరసౌఖ్య మొసగినాడవు
ధరలో నిన్నెన్న నాకుదరమా రామా॥

క॥ శ్రీకాకుత్స్థకులార్ణవ
రాకాహిమధామరామ రవినిభధామా
నీకున్బ్రణతులొనర్చెద
చేకూర్చుము నాదుకోర్కె శ్రీరఘురామా॥

క॥ వడుగువగుచు మూఁడడుగుల
పుడమిని యబ్బలిని వేఁడి పురుహూతునకుం

గడువేట్కను భువనంబులు
తడవిడక యొసంగితీవు దశరథరామా॥

క॥ మందరధర సుందరతర
యిందిందిరవేణి కమల హృదయేశనినుం
డెందమునఁ దలతు
దశరథనందన నినునమ్మినాడ నయగుణరామా॥

క॥ కలమను సురతరు వైకొని
యిలనా కాగితముమీద హెచ్చగువార్ధిన్
జలపాత్రిజేసి వ్రాయగ
నలవడునా నీదుచరితమజనుతరామా॥

క॥ పటుతరమగు చటాత్రితిని
కుటిలాలకగా నొనర్చి కూకుదశోభన్
జటిలునకు గూర్చుమహిమను
నిటలాక్షుండైన పొగడనేర్చునెరామా॥

క॥ దురితాత్ములు పీడనుచును
కరుణానిధిఁగావకున్నఁ గాచెడువారల్
ధరనెవ్వారలుగలరా
పరమాత్మనీవెగాక భవహరరామా॥

క॥ వారిద సన్నిభగాత్రా
నీరధి కన్యాకళత్రి నీరజనేత్రా

కారుణ్య గుణచరిత్రా
యేరీనీసాటివేల్పు లిలలోరామా॥

క॥ ఇనకుల జలనిధిరాకా
వనజారివటంచునిన్ను బ్రస్తుతిజేయం
గనుపడకుంటివి నీదగు
ఘననామము దాచలేవు గదరారామా॥

క॥ సురపతి గర్వాంధుండై
కరకావర్షంబు గురియగా వారింపన్
గిరియెత్తిగోపగోగణ
పరివారముగాచినావు భవహరరామా॥

క॥ ఉదరమ్మున బ్రహ్మాండము
కుదురుగధరియించి ప్రాణికోటులనెల్లన్
ముదమొందగ రక్షించిన
సదమలగుణ నిన్నునెన్న శక్యమెరామా॥

క॥ సేతువుగట్టెడు వేళను
నాతురతను యిసుక తోఁక నంటుచుజల్లన్
బ్రీతిమెయిదానివెన్నున
హేతినఖాంకురపు రేఖలిడవేరామా॥

క॥ వేదండయాన సీతయు
నీదండను నుండచండ నిర్నిద్రమహా

కోదండశరంబుల నీవా
దండకవని చెండితౌర దనుజులరామా॥

క॥ హరుని విలుదునిమిఁ మిథిలా
పురవరుమదిఁగల్గు కోర్కె భూతిఁదలిర్పన్
ధరసుతసీఁతను వేడ్కను
పరిణయమగు నిన్ను నెన్న వశమా రామా॥

క॥ జనకసుత సీతకొలమిన్
వనమునగల పుష్పపత్రి ఫలవర్గంబుల్
దనియంగఁదెచ్చియిచ్చిన
దనుజహరా నిన్ను బొగడ దరమా రామా॥

క॥ కులిశధర ముఖసురాళికి
కలశాంబుధి బొడముసుధ నఖండితశక్తిం
లలితాంగివగుచు వారల
కలవడగాఁజేశితౌ గుణాధికరామా॥

క॥ పురుహూత సుతుని మేలా
శరమున ఖండించి మిత్రిసంజాతునకున్
దరుచరరాజ్యం మొసంగిన
కరిపాలా నిన్ను బొగడగలనా రామా॥

క॥ ద్రుపదసుత వేఁడ చపలత
నపరిమితంబైన వలువలంచితమతివై

నిపుణతచే చేకూర్చిన
తపసినుతా నన్ను గావదగదా రామా॥

క॥ మునివేషధారి వగుచును
వనమునకే తెంచి దనుజవర్గము నెల్లన్
దునుమాడి సాధురక్షణ
మొనరించిన వాడవౌర యుర్విని రామా॥

క॥ పావనములు మృతజన సం
జీవనములు నీదు పాదసరసీరుహముల్
భావించెద ననిశము నీ
సేవకులకు సేవకుండ శ్రీరఘురామా॥

క॥ హలకులిశ చక్రరేఖా
కలితంబులు నీదుపాద కంజాతంబుల్
జలజాలయ హృత్సరసిజ
విలసనములు నమ్మిగొలుతు విసృతరామా॥

క॥ నినుస్మరియించిన జనులకు
ఘనముగ నిహపరములొసఁగి గాచెదవనుచున్
మనమున దలంచి వేఁడిన
ననుబ్రోవవ దేమిపింత నయగుణరామా॥

క॥ కరిగావ మకరిశిరమును
త్వరితంబుగఁ దునుముమాట్కి తద్దయునాడా

దురితంబులెల్లఁ బాపియు
కరుణానిధిగావు వేగ ఘనగుణరామా॥

క॥ తెరవు నగమించువేళను
శరధిపయి న్నావనెక్కి జనియెడు నెడపె
న్నురగముఁ గన్పడువేళను
నరసఖరక్షించునీదు నామమెరామా॥

క॥ దురితాంబుధి దాటుటకై
మురహర నీనామనౌకముదముం గూర్పం
జిరకాల దరిద్రిసకును
యజుచేతిధనంబుపోల్కె నదెగదరామా॥

క॥ చిరతరరోగంబులు వే
హరియింపను నీదునామ మమృతమటంచున్
స్మరియించుచు సేవించెద
దురితాటవి వీతిహోత్రి దోర్బలరామా॥

క॥ నిగమంబులు పన్నగపతి
నగజాదయితుండు సురలునాకాధిపుడున్
బొగడంగలేరు నీనగు
సుగుణంబులు జగతి భక్తసులభారామా॥

క॥ సురకరునలివలె రక్కసు
దురవడినిన్బట్టి ద్రిప్ప యుప్పరమునకున్

త్వరితగతి నేగివానిన్
బరిమార్పవె రాలమీద భవహరరామా॥

క॥ హరిసుతునకు సారథివై
కురుసైన్యంబెల్లనీనె గురుతరశక్తిన్
బరిమార్పింపవె నరుచే
దురితాంధతమఃపతంగ దోర్బలరామా॥

క॥ శరనిధి తరంగ పటలము
ధరసైకతరేణువితతి తారాగణముల్
గురుతుగ గణింపవచ్చును
వరగుణ నిన్నెన్న నాకు వశమా రామా॥

క॥ సరసిజ మిత్రకుమారుం
డురగాస్త్రము విజయుపైని నుజ్వలశక్తిన్
పరగింప దానిదోర్చియు
నరునిన్ రక్షించినావు నగధరరామా॥

క॥ కదనమున పాంచజన్యము
వదలకపూరింప శత్రువర్గంబెల్లన్
చదలకు పారరెభీతిని
సదమలకళ్యాణనామ జగదభిరామా॥

క॥ దురితాటవి హరియింపను
నెఱగలియని నీదునామ మెన్నుచునేనున్

స్మరియించిన ననుగావవు
హరనుతసీతాకళత్రి యఘహరరామా॥

క॥ దనుజాధిపు (జెలియలికిని
ననుజునిచే ముక్కుచెవుల నతివేగమునన్
సునిశితకరాళధారను
తునియలుగావించితీవు దోర్బలరామా॥

క॥ చరళయుత గరళమెక్కువ
నురుకుచములనాని నీకునొసంగెడు మతిచే
నరుదెంచు దుష్టపూతన
హరియించినవాడవీవె హరనుతరామా॥

క॥ హరునకును నద్రికన్యా
తరుణీమణికల్ల ద్రుపదు తనయకునార్తుల్
హరియించినట్టి నీదగు
వరనామము సంస్మరింతు భవహరరామా॥

క॥ అక్షీణకటాక్షేక్షణ
లక్ష్మీహృత్పద్మమిత్రి లావణ్య గరు
త్మత్కేంద్రి వాహనన్నుం
రక్షింపను నీవెగావె రఘుకులరామా॥

క॥ వనధర సన్నిభగాత్రి
దనుజలతావళిలవిత్రి దశరథపుత్రి

వనజహితకుల పవిత్రా
మునిజన నుతిపాత్రనీకు మ్రొక్కెద రామా॥

క॥ నారీవేషము దాల్చియు
ధీరుండైనట్టి శివుని తేజంబిలపై
జారంజేసిన ప్రౌఢవు
సూరిజనస్తుత్యసుగుణ శోభితరామా॥

క॥ సురపతిసుతునకు నీదగు
పరమాద్భుత మైనయట్టి భాసురవిశ్వం
భరరూపుజూపి వానిం
బరితోషితుజేసితీవు భవహరరామా॥

క॥ కాళియ ఫణిపడగలపై
కేళీనటనంబుసలుప కృష్ణాయని త
న్నాళీకాక్షులు వేడగ
హేళింగృపఁవిడిచితీవు యాతనిరామా॥

క॥ అంజలిగావించెద రిపు
భంజనలోకైకవీర భానుకులేశా
కుంజరరక్షక బోవిపుర
రంజితగీర్వాణవినుత రఘుకులరామా॥

క॥ శిక్షించితి నిర్దోషుల
బిక్షుకులఁ దోచినాడ బీదరికముచే

రక్షించుమవియు నెన్నక
చక్షుశ్రీవ భూషమిత్రి జగదభిరామా॥

క॥ ఇనజుని పై దనుజాధిపు
ననుజుని పై దయనుజూపి యయ్యిరువురకున్
ఘనతర రాజ్యములొసగిన
సనకామరవినుత సుగుణ జగదభిరామా॥

క॥ మునుదశరధ కౌసల్యలు
ఘనముగ నేతపమొనర్చి గంటిరొనిన్నున్
దనుజుల హతమొనరింపను
మునులను రక్షించుకొరకు ముదమున రామా॥

క॥ ధనుజాధిపు డనుపంగను
కనకపు మృగమగుచువచ్చు ఖలుమారీచున్
దునిమితివి శితశరంబున
ఘనమగు నీశక్తి బొగడగలనా రామా॥

క॥ పంచశర విప్రతనయుడు
పంచత్వమునొంద వానిబ్రదికించుటకై
పంచజ్ఞాన్వయు తపము హ
రించి రసాసురుని నాదరింపవె రామా॥

క॥ నీకరుణ గల్గువారికి
నాకపురీ సుఖములొసగినాడవటంచున్

లోకులవలనన్ దెలిసియు
శ్రీకర నినువేడువాడ శ్రీరఘురామా॥

క॥ నీకరుణారస వేశము
చేకొనియున్నంతమాత్ర సిద్ధించుగదా
లోకులకెల్ల శుభంబులు
శ్రీకర కరుణావిశాల శ్రీరఘురామా॥

క॥ సిరిగలిగియున్న నిన్నుం
బరికింపుచు నాదులేమిఁ బాపుమటంచున్
నిరతము వేడిన గావవు
హరమిత్ర యిదియునీకు న్యాయమెరామా॥

క॥ శ్రీదంబులు భవ బంధ
చ్ఛేదంబులు మునిజనాళిసేవితపూజా
మోదంబులు నీదగు మృదు
పాదంబులు గొలుతు భక్తపాలనరామా॥

క॥ నీకరములు యాచకులకు
నాకపురీద్రుమములంచు నమ్మియు వేడన్
నాకుం గానునొసంగవు
శ్రీకర నేనేమితప్పు జేసితిరామా॥

క॥ సత్రాజిత్పుత్రికకున్
గోత్రారిపురంబుఁ జేరి కుతుకం బెసగన్

సుత్రామతరువాసంగవె
శత్రుహరా నిన్ను బొగడ శక్యమె రామా॥

క॥ వామపదాగ్రంబున నల
భామామణియైన సత్యపటురోషమునన్
నీమెయిఁ దాకగ నేమియు
నామెను శిక్షింపకుండ నరయవె రామా॥

క॥ ఇందుని జలజాతాప్తుని
కందమ్ములుగా ధరించి ఘనతరబ్రహ్మా
నందంబు నొందు నిన్నున్
నందసుతా యెన్నదరమె నాకున్ రామా॥

క॥ మన్నుం దింటివటంచును
నిన్నడిగిన నోరు దెరచి నిఖిలజగంబుల్
గ్రన్నన దల్లికిజూపిన
యన్నా నిన్నెన్నదరమె యజునకు రామా॥

క॥ ద్వారక పుటభేదనమున
సారసనేత్రిలను గూడి సంసారకళా
సారముచే వర్తిల్లిన
చారుగుణా నినునుతింప శక్యమె రామా॥

క॥ చెన్నుగ శబరియొసంగిన
నెన్నిక చెడియున్నయట్టి నెంగిలిఫలముల్

క॥ వనమున కేగెడువేళను
దనుజులను జయింతువనుచు తపసులుపలుకన్
మనమున సంతసపడి య
ద్దనుజులఁ జక్కాడినావు దశరధరామా॥

క॥ వనవాస క్లేశంబున
ననయము ఫలమూలభక్షణాధికశ్రమమున్
గననేరఁ జాలవైతివి
వనజేక్షణ సీతచెంత వర్తిలరామా॥

క॥ కరివరద నీదుభక్తుల
దురితాద్రిచ్ఛేదలమ్రింప తూరుపునాడేల్
దొరచేతి కులిశమాగద
నిరతము నీనామభజన నిర్గుణరామా॥

క॥ క్షీరనిధి నుద్భవించిన
శ్రీరమణిఁ గరముపట్టి చేకొని హృద్వ్యా
పారీణతచే నుంటివి
నారదసంగీతలోల నయగుణరామా॥

క॥ పరనారీవిముఖతయును
దురితంబులయందు మనము దోఁచకయుండన్
కరివరద చేయనీవే
మఱిమెవ్వరు నాకులేరు మహిలోరామా॥

క॥ తరువుల జనించు సుమములు
తరువులనె నశించిపోవుఁ దద్దయునవినీ

చరణంబుల నర్చించిన
స్థిరభక్తులకిడవె మోక్ష సిద్ధియు రామా॥

క॥ సురగరుడయక్షకిన్నర
నరఖేచరసిద్ధసాధ్య నాకేశాదుల్
పరమానందము నొందగ
బరిమార్చితివసురవరుల భవహర రామా॥

క॥ వినయమున పిడికెడటుకులు
గొనియొసగిన నక్కుచేలు గుణనిధి నెలమిన్
ఘనభాగ్యోపేతునిగా
నొనరించినవాడవీవె యుర్విని రామా॥

క॥ మునివరుడగు జమదగ్నికిఁ
దనయుండౌ పరశురాము దర్పము నెల్లన్
ధనువంటుచుఁ గైకొంటివి
దనుజారీ సుగుణచారి దశరథ రామా॥

క॥ నరకాసురుని వధించియు
గురుతరయదితికిని రత్నకుండలములు నీ
వరుదొంద నొసగినాడవు
తరణికులాధీశ వేడ్క దశరథ రామా॥

క॥ కదనమున పక్షివదనుని
మదమెల్ల హరించి వానిమస్తకవితతుల్

పవిదరముచే ఖండించిన
సదమలగుణ నిన్ను నెన్న శక్యమే రామా॥

క॥ వారిధిగట్టంబడునా
నీరధిపై గిరులు దేలునే కడుచిత్రం
బేరికిదరమా యీపని
కారుణ్యసుధాబ్ధి నీకెగాకను రామా॥

క॥ భల్లుకపతి నీతోడను
మల్లాహవమలరఁ జేయ మాత్సర్యంబున్
డుల్లగపిడికిటఁ బొడిచిన
ముల్లోకస్తుత్యనీకు మ్రొక్కెద రామా॥

క॥ నరకాసురుని వధింపను
చిరతరగుణియైన సత్యచేతికి శరమున్
ద్వరితగతి నొసఁగి వానిం
బరిమార్పించితివి భక్తవత్సల రామా॥

క॥ మునిసతులొసంగు నన్నము
దిని వారికి మోక్షమొసఁగితివని విని నే
నినుగొలిచిన నను గావవు
దనుజహరా దలపనీకు ధర్మమె రామా॥

క॥ పరమదయానిధి వంచును
దురితంబులుఁ దొలగఁ ద్రోయి దొరవీవంచున్

నిరతమును నమ్మి వేడిన
కరుణింపవ దేమి నన్ను ఘనగుణరామా॥

క॥ దురితాటవి దహియింపను
నెఱఁగలినీనామ మనుచు నే నెరిగి మదిన్
దిరముగ నమ్మి స్మరించెద
నరసఖ సీతాకళత్రి నగధరరామా॥

క॥ సేవకుడ నీదు భక్తుడ
గావున నను నీవె దయను గరుణింపదగున్
భావించి గావకుండిన
శ్రీవర నాకెవరు దిక్కు క్షితిలో రామా॥

క॥ భండనమున రిపుల భుజా
దండంబులు హేతిచేత దర్పితలీలన్
ఖండించిన నీదగు దో
ర్దండములకు వందనములు దశరథరామా॥

క॥ వినయమున విదురుడిడు యో
దనమమృతంబటంచు నెంచిదనియ వెదురో
ధనుడిదు రుచ్యములంటవు
వనజాక్షా నినునుతింప వశమే రామా॥

క॥ సురభియుగంధము సరులున్
చిరభక్తిని కుబ్జయొసగ చేకొనుచునుయా

తరుణీమణి యొడలంగల
విరసపు వంకరయుదీర్చి వేయవెరామా

క॥ ఆపదలఁ దోృచిభక్తుల
పాపంబులణంచునట్టి ఘోృఢవనుచునీ
పాృపేనమ్మితి గావుర
శ్రీపాలాభక్తలోల శ్రీరఘురామా॥

క॥ తిరుమలియందు ప్రభుత్వము
గురుతరమగునీలగిరిని కుతుకప్రభుక్తిన్
వరహారిగిరి సౌగన్ధ్యము
తరణి కులాధీశ నీకెదగునివె రామా॥

క॥ దండము రవిశశిలోచన
దండము యండజ సువాహదర్పక జనకా
దండము కిరీటభూషణ
దండంబులు నీకు నెపుడు దశరథరామా॥

క॥ అంజలికుండలిశయనా
యంజలి సుగుణాభిరామ హరనుతనామా
యంజలి యినకులదీపక
యంజలి యనిశంబు నీకు నఘహరరామా॥

క॥ ధరచాప చుట్టుజుట్టిన
దురితుండగు హేమనేతృ దుర్భరగాతృ

బరిమార్చవె కిటిరూపున
ధరణిజ హృత్పద్మమిత్ర దశరథరామా॥

క॥ మునివరుడగు గాధేయుని
ఘనతరయాగంబు చెరుపుగావించిన యా
దనుజులనెల్ల హరించియు
మునిమఖమునుగాచు నీకు మ్రొక్కెద రామా॥

క॥ పదియాఱువేల గోపీ
మదవతులం బెండ్లియాడి మనసిజలీలా
కదనంబు సలుపు దేవకి
సుదతీసుత యమరవినుత శోభితరామా॥

క॥ బలిని రసాతాలమునకుఁ
దోలగించినరీతి నాదు దురితములెల్లఁ
సలలితమతిఁ బరిమార్చుము
జలజాలయమిత్ర జలధిశయనా రామా॥

క॥ వనజాసను వేదంబులు
దనుజుఁడుగొని శరధిలోన దాఁగిలఁబడగా
వనచరరూపున వానిం
దునుమాడవె వేగనీవు దోర్బలరామా॥

క॥ ఖలుఁడను ధర్మవిహీనుఁడఁ
దలపంగాలేదు నీదు ధ్యానము మదిలో
బలహీనుఁడ దుర్మదుఁడను
జలజాక్షా నన్ను నెట్లు సాఁకెద రామా॥

క॥ మంగళము నందనందన
మంగళము కృపాపయోధి మంగళము హరీ
మంగళము పాపభంజన
మంగళమయ నీకునెపుడు మావరరామా॥

క॥ అందముగ నూరుయెనిమిది
కందములురచించి వేడ్క ఘనతరభక్తిన్
వందనమిడి నీకొసఁగితి
కందర్పాకార యివియుఁ గైకొనురామా॥

క॥ జగదవన నీకుఁగృతిగా
పొగరాన్వయ కృష్ణమూర్తి బుధులునుతింపన్
దగఁజెప్పె కందశతకము
నిగమస్తుత దీనిఁగొనుము నెమ్మిగ రామా॥

చ॥ వరగుణియయ్యగారి కులవర్ధను డైదగు రామమూర్తి
నరునకు నంకితంబుగను భక్తియుతంబుగ కందపద్య సం
భరిత శతాష్టకావ్యమును భాసురలీల రచించుమన్న చో
కరమనురక్తి జెప్పితిని గైకొని ప్రోవుర జానకీవరా॥

శ్రీ సీతారామ లక్ష్మణ భరత శత్రుఘ్న
పరివార సమేత శ్రీరామార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.



# శ్రీరామ శతకము.

శ్రీ భగవద్భక్తి పరాయణుండగు

## పాగరు కృష్ణమూర్తిచే

రచియింపబడి ప్రకటింపబడినది.

---

శ్రీరామ నామాంకిత కందపద్యశతము

---



విజయనగరము

శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాలయందు

ముద్రితము

1932.



రాములు.

ఉ॥ అనుపమభక్తలోక శరణాచరణాదరణాత్ముఁడౌ శివ
జ్జనకుఁడు కంజలోచనుఁడు తల్లి యుమాసతి వేల్పుపెద్దవీ
వని వనజాసనున్బొగడ నాతఁడు తన్నటుసన్నుతింపవిం
చును నగుదీప్తిసూనుశివసూను షడాననసూనుమ్రొక్కెదన్॥

కం॥ హరిహర హిరణ్యగర్భుల
సరసిజముఖివాణి కమల శర్వాణులకున్
నిరతము నమస్కరించెదఁ
బరమానందంబెలర్ప వాక్ప్రౌఢిమకుఁ॥

కం॥ మునిమాపుకడ గజానన
జనకుఁడు తాండవము సలుపు చాతురి రీతిన్
ననయము నాదగు జిహ్వను
జననీ నటియించు కమల సంభవురాణీ॥





# శ్రీ రామ శతకము.

క॥ శ్రీకర రమాకళత్రా
ప్రాకట రవిచంద్రనేత్ర వరశుభగాత్రా
లోకోత్తర చారిత్రా
చేకూర్చుము నాదుకోర్కె శ్రీరఘురామా॥

క॥ అందంబుగ విబుధ జనా
నందంబుగ కర్ణములకు నయమందగ బ
ల్విందుగ జెప్పెద నీపై
కందంబులు నన్నుగావు ఘనగుణరామా॥

క॥ రామా రఘుకులవార్నిధి
సోమా సాకేతధామ శోభితసుగుణ
స్తోమా రిపుభీమా రవి
ధామా సుత్రామవినుత దశరథరామా॥

క॥ అల పాలకడలియందున
విలసిత వటపత్రమందు వేడుకలలరన్

లలనామణియగు లక్ష్మీ
కలకంఠియుతుండ వైన ఘనరఘురామా॥

క॥ సనకసనందన మునిజన
వనరుహ గర్భామరేంద్రవర్యులు నిన్నున్
వినుతు లొనర్పగజాలరు
ననఘా నిన్నెన్న నాకునలవియె రామా॥

క॥ ఘనమునిజననుత నిన్నున్
మనమున ననయమునుదలతు మరువక నన్నున్
తనయుని క్రియరక్షింపుము
జనకజ హృత్పద్మమిత్ర సద్గుణరామా॥

క॥ శర్వాణి వినుతనామా
యుర్వీసుత నేత్ర కైరవోన్నతసోమా
గర్వారి మదవిరామా
దర్వీకరశయన నన్ను దయగనురామా॥

క॥ పురుహూతామర వర్యులు
కరుణింపుమటంచు వేడ కరుణానిధివై
సురవైరుల కదనములో
హరియించియు వారిగాచితౌరా రామా॥

క॥ నినుస్మరియించిన జనులకు
ఘనతరదుఃఖములుబాపు ఘనుడవటంచున్

మనసునఁ దలంచి వేడిన
ననుగావవ దేమి వింత నయగుణరామా॥

క॥ హరునకు దోడై త్రిపురా
సురులఁ హరియించు వేళ శూలికినీవున్
శరమై వారలదుంపవె
కరిపాలాభ క్తలోల ఘనగుణరామా॥

క॥ గురుతనయుఁడు సంద్రములో
నురికియు పంచత్వ మొంద నొప్పుగ వానిన్
దిరమతినిఁ దెచ్చి గురునకు
కరుణాకర యొసఁగితీవు ఘనగుణరామా॥

క॥ ఖరదూషణాది రాక్షస
వరులను దునుమాడి మౌనివర్యుల కెల్లన్
చిరసౌఖ్య మొసగినాడవు
ధరలో నిన్నెన్న నాకుదరమా రామా॥

క॥ శ్రీ కాకుత్స్థకులార్ణవ
రాకాహిమధామరామ రవినిభధామా
నీకున్ప్రణతులొనర్చెద
చేకూర్చుము నాదుకోర్కె శ్రీరఘురామా॥

క॥ వడుగువగుచు మూఁడడుగుల
పుడమిని యబ్బలిని వేడి పురుహూతునకుం

గడువేట్కను భువనంబులు
తడవిడక యొసంగితీవు దశరథరామా॥

క॥ మందరధర సుందరతర
యిందిందిరవేణి కమల హృదయేశనినుం
డెందమునఁ దలతు
దశరథనందన నినునమ్మినాడ నయగుణరామా॥

క॥ కలమను సురతరువైగైకొని
యిలనా కాగితమమీద హెచ్చగువార్ధిన్
జలపాత్రిజేసి వ్రాయగ
నలవడునా నీదుచరితమజనుతరామా॥

క॥ పటుతరమగు చటాత్రితిని
కుటిలాలకగా నొనర్చి కూకుదశోభన్
జటిలునకు గూర్చుమహిమను
నిటలాక్షుండైన పొగడనేర్చునెరామా॥

క॥ దురితాత్ముడు పీడనుచును
కరుణానిధిఁగావకున్నఁ గాచెడువారల్
ధరనెవ్వారులుగలరా
పరమాత్మనీవెగాక భవహరరామా॥

క॥ వారిద సన్నిభగాత్రా
నీరధి కన్యాకళత్ర నీరజనేత్రా

కారుణ్య గుణచరిత్రా
యేరీనీసాటివేల్పు లిలలోరామా॥

క॥ ఇనకుల జలనిధిరాకా
వనజారివటంచునిన్ను బ్రిస్తుతిజేయం
గనుపడకుంటివి నీదగు
ఘననామము దాచలేవు గదరారామా॥

క॥ సురపతి గర్వాంధుండై
కరకావర్షంబు గురియగా వారింపన్
గిరియెత్తిగోపగోగణ
పరివారముగాచినావు భవహరరామా॥

క॥ ఉదరమ్మున బ్రహ్మాండము
కుదురుగధరియించి ప్రాణికోటులనెల్లన్
ముదమొందగ రక్షించిన
సదమలగుణ నిన్నునెన్న శక్యమెరామా॥

క॥ సేతువుగట్టెడు వేళను
నాతురతను యుసుక తోఁక నంటుచుజల్లన్
బ్రీతిమెయిదానివెన్నున
హేతినఖాంకురవు రేఖలిడవేరామా॥

క॥ వేదండయాన సీతయు
నీదండను నుండచెండ నిర్నిదప్రమహా

కోదండశరంబుల నీవా
దండకవని చెండితౌర దనుజుల రామా॥

క॥ హరుని విలుదునిమిఁ మిథిలా
పురవరుమదిఁగల్గు కోర్కె భూతిఁదలిర్పన్
ధరసుతసీఁతను వేడ్కను
పరిణయమగు నిన్ను నెన్న వశమా రామా॥

క॥ జనకసుత సీతకెలమిన్
వనమునగల పుష్పపత్రి ఫలవర్గంబుల్
దనియంగఁ దెచ్చియిచ్చిన
దనుజహరా నిన్ను బొగడ దరమా రామా॥

క॥ కులిశధర ముఖసురాళికి
కలశాంబుధి బొడముసుధనఖండితశక్తిం
లలితాంగివగుచు వారల
కలవడగాఁ జేశితౌ గుణాధిక రామా॥

క॥ పురుహూత సుతుని మేలా
శరమున ఖండించి మిత్రసంజాతునకున్
దరుచరరాజ్య మొసంగిన
కరిపాలా నిన్ను బొగడగలనా రామా॥

క॥ ద్రుపదసుత వేఁడ చపలత
నపరిమితంబైన వలువలంచితమతివై

నిపుణతచే చేకూర్చిన
తపసినుతా నన్ను గావదగదా రామా॥

క॥ మునివేషధారి వగుచును
వనమునకే తెంచి దనుజవర్గము నెల్లన్
దునుమాడి సాధురక్షణ
మొనరించిన వాడవౌర యుర్విని రామా॥

క॥ పావనములు మృతజన సం
జీవనములు నీదు పాదసరసీరుహముల్
భావించెద ననిశము నీ
సేవకులకు సేవకుండ శ్రీరఘురామా॥

క॥ హలకులిశ చక్రరేఖా
కలితంబులు నీదుపాద కంజాతంబుల్
జలజాలయ హృత్సరసిజ
విలసనములు నమ్మిగొలుతు విసృతరామా॥

క॥ నినుస్మరియించిన జనులకు
ఘనముగ నిహపరములొసఁగి గాచెదవనుచున్
మనమున దలంచి వేఁడిన
ననుబ్రోవవదేమివింత నయగుణరామా॥

క॥ కరిగావ మకరిశిరమును
త్వరితంబుగఁ దునుముమాట్కి తద్దయునాడా

దురితంబులెల్లఁ బాపియు
కరుణానిధిగావు వేగ ఘనగుణరామా॥

క॥ తెరవు నగమించువేళను
శరధిపయి న్నావనెక్కి జనియెడు నెడపె
న్నురగముఁ గన్పడువేళను
నరసఖరక్షించునీదు నామమెరామా॥

క॥ దురితాంబుధి దాటుటకై
మురహర నీనామనౌకముదముం గూర్పం
జిరకాల దరిద్రునకును
యజుచేతిధనంబుపోల్కె నదెగదరామా॥

క॥ చిరతరరోగంబులు వే
హరియింపను నీదునామ మమృతమటంచున్
స్మరియించుచు సేవించెద
దురితాటవి వీతిహోత్ర దోర్బలరామా॥

క॥ నిగమంబులు పన్నగపతి
నగజాదయితుండు సురలునాకాధిపుడున్
బొగడంగలేరు నీనగు
సుగుణంబులు జగతి భక్తసులభారామా॥

క॥ సురకరునలివలె రక్కసు
దురవడినిన్పట్టి ద్రిప్ప యుప్పరమునకున్

త్వరితగతి నేగివానిన్
బరిమార్పవె రాలమీాద భవహరరామా॥

క॥ హరిసుతునకు సారథివై
కురుసైన్యంబెల్లనీవె గురుతరశక్తిన్
బరిమార్పింపవె నరుచే
దురితాంధతమఃపతంగ దోర్బలరామా॥

క॥ శరనిధి తరంగ పటలము
ధరసైకతరేణువితతి తారాగణముల్
గురుతుగ గణింపవచ్చును
వరగుణ నిన్నెన్ననాకు వశమా రామా॥

క॥ సరసిజ మిత్రకుమారుం
డురగాస్త్రము విజయుపైని నుజ్వలశక్తిన్
పరగింప దానిద్రోచియు
నరునిన్ రక్షించినావు నగధరరామా॥

క॥ కదనమున పాంచజన్యము
వదలకపూరింప శత్రువర్గంబెల్లన్
చదలకు పారరెభీతిని
సదమలకళ్యాణనామ జగదభిరామా॥

క॥ దురితాటవి హరియింపను
నెఱగలియని నీదునామ మెన్నుచునేనున్

స్మరియించిన ననుగావవు
హరనుతసీతాకళత్ర యఘహరరామా॥

క॥ దనుజాధిపు (జెలియలికిని
ననుజునిచే ముక్కు చెవుల నతివేగమునన్
సునిశితకరాళధారను
తునియలుగావించితీవు దోర్బలరామా॥

క॥ చరళయుత గరళమెక్కువ
నురుకుచములనాని నీకునొసఁగెడు మతిచే
నరుదెంచు దుష్టపూతన
హరియించినవాడవీవె హరనుతరామా॥

క॥ హరునకును నద్రికన్యా
తరుణీమణికల్ల దుృపదు తనయకునార్తుల్
హరియించినట్టి నీదగు
వరనామము సంస్మరింతు భవహరరామా॥

క॥ అక్షీణకటాక్షేక్షణ
లక్ష్మ్యా హ్రాత్పద్మమిత్ర లావణ్య గరు
త్పక్షీంద్ర వాహనన్నుం
రక్షింపను నీవెఁగావె రఘుకులరామా॥

క॥ వనధర సన్నిభగాత్రా
దనుజలతావళిలవిత్ర దశరథపుత్రా

వనజహితకుల పవిత్రా
మునిజన నుతిపాత్రనీకు మ్రొక్కెదరామా॥

క॥ నారీవేషము దాల్చియు
ధీరుండైనట్టి శివుని తేజంబిలపై
జారంజేసిన ప్రౌఢవు
సూరిజనస్తుత్యసుగుణ శోభితరామా॥

క॥ సురపతిసుతునకు నీదగు
పరమాద్భుత మైనయట్టి భాసురవిశ్వం
భరరూపుజూపి వానిం
బరితోషితుజేసితీవు భవహరరామా॥

క॥ కాళియ ఫణిపడగలపై
కేళీనటనంబుసలుప కృష్ణాయని త
న్నాళీకాక్షులు వేడగ
పాళింగృపఁవిడిచితీవు యాతనిరామా॥

క॥ అంజలిగావించెద రిపు
భంజనలోకైకవీర భానుకులేశా
కుంజరరక్షక బోధ్రిపుర
రంజితగీర్వాణవినుత రఘుకులరామా॥

క॥ శిక్షించితి నిర్దోషుల
భిక్షుకులఁ ద్రోచినాడ బీదరికముచే

రక్షించుమవియు నెన్నక
చక్షుశ్రవ భూషమిత్ర జగదభిరామా॥

క॥ ఇనజునిపై దనుజాధిపు
ననుజునిపై దయనుజూపి యయ్యిరువురకున్
ఘనతర రాజ్యములొసగిన
సనకామరవినుత సుగుణ జగదభిరామా॥

క॥ మునుదశరథ కౌసల్యలు
ఘనముగ నేతపమొనర్చి గంటిరోనిన్నున్
దనుజుల హాతమొనరింపను
మునులను రక్షించుకొరకు ముదమున రామా॥

క॥ ధనుజాధిపు డనుపంగను
కనకపు మృగమగుచువచ్చు ఖలుమారీచున్
దునిమితివి శితశరంబున
ఘనమగు నీశక్తి బొగడగలనా రామా॥

క॥ పంచశర విప్రితనయుడు
పంచత్వమునొంద వానిబ్రదికించుటకై
పంచజ్ఞానవ్రయు తపము హ
రించి రసాసురుని నాదరింపవె రామా॥

క॥ నీకరుణ గల్గువారికి
నాకపురీ సుఖములొసగినాడవటంచున్

లోకులవలనన్ దెలిసియు
శ్రీకర నినువేడువాడ శ్రీరఘురామా॥

క॥ నీకరుణారస వేశము
చేకొనియున్నంతమాత్రి సిద్ధించుగదా
లోకులకెల్ల శుభంబులు
శ్రీకర కరుణావిశాల శ్రీరఘురామా॥

క॥ సిరిగలిగియున్న నిన్నుం
బరికింపుచు నాదులేమిఁ బాపుమటంచున్
నిరతము వేడిన గావవు
హరమితాత్రి యిదియునీకు న్యాయమెరామా॥

క॥ శ్రీదంబులు భవ బంధ
చ్ఛేదంబులు మునిజనాళిసేవితపూజా
మోదంబులు నీదగు మృదు
పాదంబులు గొలుతు భక్తపాలనరామా॥

క॥ సీకరములు యాచకులకు
నాకపురీదుత్రిమములంచు నమ్మియువేడన్
నాకుం గానునొసంగవు
శ్రీకర నేనేమితప్పు జేసితిరామా॥

క॥ సత్రాజిత్పుత్రికకున్
గోత్రారిపురంబుఁజేరి కుతుకంబెసగన్

సుత్రామతరువాసంగవె
శత్రుహరా నిన్ను బొగడ శక్యమె రామా॥

క॥ వామపదాగ్రంబున నల
భామామణియైన సత్యపటురోషమునన్
నీమెయిఁ దాకగ నేమియు
నామెను శిక్షింపకుండ నరయవె రామా॥

క॥ ఇందుని జలజాతాప్తుని
కందమ్ములుగా ధరించి ఘనతరబ్రహ్మా
నందంబు నొందు నిన్నున్
నందసుతా యెన్నదరమె నాకున్ రామా॥

క॥ మన్నుం దింటివటంచును
నిన్నడిగిన నోరుదెరచి నిఖిలజగంబుల్
గ్రన్నన దల్లికిజూపిన
యన్నా నిన్నెన్నదరమె యజునకు రామా॥

క॥ ద్వారక పుటభేదనమున
సారసనేత్రులనుగూడి సంసారకళా
సారముచే వర్తిల్లిన
చారుగుణా నినునుతింప శక్యమె రామా॥

క॥ చెన్నుగ శబరియొసంగిన
నెన్నిక చెడియున్నయట్టి యెంగిలిఫలముల్

సన్నుతులుజేసి మెసగవె
పన్నగ పతిశయన భక్తవత్సలరామా॥

క॥ జనకజ సాధ్వినిలంకా
వనమందునఁగాంచివచ్చి వాయుజుఁడపుడా
కనకాంగి సీతవార్తలు
వినుపింపగఁజెందినావు వేడ్కలురామా॥

క॥ దురితాత్ముఁడు వీఁడనుచును
కరుణింపకయున్న నన్నుగాచెడివారల్
ధరనెవ్వారలు లేరిక
భరతాగ్రజ నీవెఁగాక భవహరరామా॥

క॥ మురహర ముకుందమాధవ
పరమాత్మ హరేయటంచు బహుభంగులనే
స్మరియించెద ననుమనుపుము
కరిరక్షా హతవిబక్ష ఘనగుణరామా॥

క॥ అరవిందాయతనేత్రా
సురచిరఖగరాజపత్రి శోభితగాత్రా
ధరణీజాత కళత్రా
పరమాద్భుతసచ్చరిత్రి భవహరరామా॥

క॥ జలధర రుతసన్నిభమై
విలసిల్లెడు నీదునారి విపులధ్వనిచే
కలనంగల శత్రులగుం
డెలు భేదిల్లగఁజేసితీవు శివినిరామా॥

క॥ వనమున కేగెడు వేళను
దనుజులను జయింతువనుచు తపసులుపలుకన్
మనమున సంతసపడి య
ద్దనుజులఁ జక్కాడినావు దశరథరామా॥

క॥ వనవాస క్లేశంబున
ననయము ఫలమూలభక్షణాధికశ్రమమున్
గననేరఁ జాలవైతివి
వనజేక్షణ సీతచెంత వర్తిలరామా॥

క॥ కరివరద నీదుభక్తుల
దురితాద్రిచ్ఛదలమ్రింప తూరుపునాడేల్
దొరచేతి కులిశమాగద
నిరతము నీనామభజన నిర్గుణరామా॥

క॥ క్షీరనిధి నుద్భవించిన
శ్రీరమణిన్ గరముపట్టి చేకొని హృద్యా
పారీణతచే నుంటివి
నారదసంగీతలోల నయగుణరామా॥

క॥ పరనారీవిముఖతయును
దురితంబులయందు మనము దోచకయుండన్
కరివరద చేయనీవే
మఱియెవ్వరు నాకులేరు మహిలోరామా॥

క॥ తరువుల జనించు సుమములు
తరువులనె నశించిపోవుఁ దద్దయునవినీ

చరణంబుల నర్చించిన
స్థిరభక్తులకిడవె మోక్ష సిద్ధియు రామా॥

క॥ సురగరుడయక్షకిన్నర
నరఖేచరసిద్ధసాధ్య నాకేశాదుల్
పరమానందము నొందగ
బరిమార్చితివసురవరుల భవహరరామా॥

క॥ వినయమున పిడికెడటుకులు
గొనియొసగిన నక్కుచేలు గుణనిధినెలమిన్
ఘనభాగ్యోపేతునిగా
నొనరించినవాడవీవె యుర్విని రామా॥

క॥ మునివరుడగు జమదగ్నికిఁ
దనయుండౌ పరశురాము దర్పమునెల్లన్
ధనువంటుచుఁ గైకొంటివి
దనుజారీ సుగుణచారి దశరథరామా॥

క॥ నరకాసురుని వధించియు
గురుతరయదితికిని రత్నకుండలములు నీ
వరుదొంద నొసగినాడవు
తరణికులాధీశ వేడ్క దశరథరామా॥

క॥ కదనమున పక్షివదనుని
మదమెల్ల హరించి వానిమస్తకవితతుల్

పర్విదరముచే ఖండించిన
సదమలగుణ నిన్ను నెన్న శక్యమే రామా॥

క॥ వారిధిగట్టంబడునా
నీరధిపై గిరులు దేలునే కడుచిత్రం
బేరికిదరమా యీపని
కారుణ్యసుధాబ్ధి నీకెగాకను రామా॥

క॥ భల్లూకపతి నీతోడను
మల్లాహవమలరఁ జేయ మాత్సర్యంబున్
డుల్లగపిడికిటఁ బొడిచిన
ముల్లోకస్తుత్యనీకు మ్రొక్కెద రామా॥

క॥ నరకాసురుని వధింపను
చిరతరగుణియైన సత్యచేతికి శరమున్
ద్వరితగతి నొసఁగి వానిం
బరిమార్పించితివి భక్తవత్సల రామా॥

క॥ మునిసతులొసంగు నన్నము
దిని వారికిమోక్షమొసఁగితీవని విని నే
నినుగొలిచిన ననుగావవు
దనుజహరా దలపనీకు ధర్మమె రామా॥

క॥ పరమదయానిధి వంచును
దురితంబులుఁదొలగఁ ద్రోయ దొరవీవంచున్

నిరతమును నమ్మివేడిన
కరుణింపవదేమి నన్ను ఘనగుణరామా॥

క॥ దురితాటవి దహియింపను
నెఱగలినీనామ మనుచునే నెరిగిమదిన్
దిరముగనమ్మి స్మరించెద
నరసఖసీతాకళత్రి నగధరరామా॥

క॥ సేవకుడ నీదుభక్తుడ
గావున నను నీవె దయను గరుణింపదగున్
భావించి గావకుండిన
శ్రీవర నాకెవరుదిక్కు క్షితిలోరామా॥

క॥ భండనమున రిపులభుజా
దండంబులు హేతిచేతదర్పితలీలన్
ఖండించిన నీదగుదో
ర్దండములకు వందనములు దశరథరామా॥

క॥ వినయమున విదురుడిడుయో
దనమమృతంబటంచు నెంచిదనియవెదుర్వో
ధనుడిడు రుచ్యములంటవు
వనజాక్షా నినునుతింప వశమేరామా॥

క॥ సురభియుగంధము సరులున్
చిరభక్తిని కుబ్జయొసగ చేకొనుచునుయా

తరుణీమణి యొడలంగల
విరసపు వంకరయుదీర్చి వేయవెరామా

క॥ ఆపదలఁ దోర్చిభక్తుల
పాపంబులణంచునట్టి ప్రౌఢవనుచునీ
ప్రాపేనమ్మితి గావుర
శ్రీపాలాభక్తలోల శ్రీరఘురామా॥

క॥ తిరుమలియందు ప్రభుత్వము
గురుతరమగునీలగిరిని కుతుకపుభక్తిన్
వరహరిగిరి సౌగన్ధ్యము
తరణి కులాధీశ నీకెదగునివె రామా॥

క॥ దండము రవిశశిలోచన
దండము యండజ సువాహదర్పక జనకా
దండము కిరీటభూషణ
దండంబులు నీకు నెపుడు దశరధరామా॥

క॥ అంజలికుండలిశయనా
యంజలి సుగుణాభిరామ హరనుతనామా
యంజలి యినకులదీపక
యంజలి యనిశంబు నీకు నఘహరరామా॥

క॥ ధరచాప చుట్టుజుట్టిన
దురితుండగు హేమనేత్రు దుర్భరగాత్రున్

బరిమార్పవె కిటిరూపున
ధరణిజ హృత్పద్మమిత్ర దశరథరామా॥

క॥ మునివరుడగు గాధేయుని
ఘనతరయాగంబు చెరుపుగావించిన యా
దనుజులనెల్ల హరించియు
మునిమఖమునుగాచు నీకు మ్రొక్కెద రామా॥

క॥ పదియారువేల గోపీ
మదవతులం బెండ్లియాడి మనసిజలీలా
కదనంబు సలుపు దేవకి
సుదతీసుత యమరవినుత శోభితరామా॥

క॥ బలిని రసాతాలమునకుఁ
ద్రొలగించినరీతి నాదు దురితములెల్లన్
సలలితమతిఁ బరిమార్పుము
జలజాలయమిత్ర జలధిశయనా రామా॥

క॥ వనజాసను వేదంబులు
దనుజుఁడుగొని శరధిలోన దాఁగిలఁబడగా
వనచరరూపున వానిం
దునుమాడవె వేగనీవు దోర్బలరామా॥

క॥ ఖలుఁడను ధర్మవిహీనుఁడఁ
దలపంగాలేదు నీదు ధ్యానము మదిలో
బలహీనుఁడ దుర్మదుఁడను
జలజాక్షా నన్నునెట్లు సాఁకెదరామా॥

క॥ మంగళము నందనందన
మంగళము కృపాపయోధి మంగళము హరీ
మంగళము పాపభంజన
మంగళమయ నీకునెపుడు మావరరామా॥

క॥ అందముగ నూరుయెనిమిది
కందములురచించి వేడ్క ఘనతరభక్తిన్
వందనమిడి నీకొసఁగితి
కందర్పాకార యివియుఁ గైకొనురామా॥

క॥ జగదవన నీకుఁగృతిగా
సాగరాన్వయ కృష్ణమూర్తి బుధులునుతింపన్
దగఁజెప్పె కందశతకము
నిగమస్తుత దీనిఁగొనుము నెమ్మిగ రామా॥

చ॥ వరగుణియయ్యగారి కులవర్ధనుఁడైదగు రామమూర్తి
నరునకు నంకితంబుగను భక్తియుతంబుగ కందపద్య సం
భరిత శతాష్టకావ్యమును భాసురలీల రచించుమన్న చో
కరమనురక్తి జెప్పితిని గైకొని ప్రోవుర జానకీవరా॥

శ్రీ సీతారామ లక్ష్మణ భరత శత్రుఘ్న
పరివార సమేత శ్రీ రామార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.